ప్రత్యామ్నాయ సామాజిక కార్యకర్త అనురాధా గాంధీ
70వ జయంతి, 15 వ వర్ధంతి స్మరణలో...

# నాకో భార్య కావాలి!

## (పురుషాధిక్యతపై వ్యంగ రచన)


మూలం: జడీ బ్రాడీ

తెలుగు: గౌరవ్



ప్రచురణ:

మేకా సత్యనారాయణ శాస్త్రి (బాంబు) స్మారక వేదిక,

పిఠాపురం.

ప్రత్యామ్నాయ సామాజిక కార్యకర్త అనురాధా గాంధీ 70వ జయంతి,
15 వ వర్ధంతి స్మరణలో...

# నాకో భార్య కావాలి!

(పురుషాధిక్యతపై వ్యంగ రచన)

మూలం:

**జడీ బ్రాడీ**

తెలుగు:

**గౌరవ్**

ప్రచురణ:

**మేకా సత్యనారాయణ శాస్త్రి (బాంబు) స్మారక వేదిక,**

**పిఠాపురం.**

# నాకో భార్య కావాలి!

(పురుషాధిక్యతపై వ్యంగ రచన)

మూలం:

**జడీ బ్రాడీ**

తెలుగు:

**గౌరవ్**

ప్రచురణ:

**మేకా సత్యనారాయణశాస్త్రి (బాంబు) స్మారక వేదిక**

ముఖచిత్రం:

**కేరళలో వాళ్ళమ్మ స్మృతి చిహ్నంగా ఒక విద్యార్థి వేసింది**



వివరాలకు:

**9032094492**

# అనువాదకుడి మాట

జడీ బ్రాడీ (1937 – 2017) ప్రముఖ అమెరికన్ ఫెమినిస్ట్ రచయిత్రి. I want a Wife అనే ఆమె ప్రసిద్ధ ప్రసంగాన్ని సమానత్వం కోసం జరిగిన ఒక ఊరేగింపు కోసం రాసింది. పందొమ్మిదవ సవరణ ద్వారా మహిళలకు కూడా సమాన ఓటు హక్కు కల్పించి 50 సంవత్సరాలు పూర్తయిన సందర్భంగా జరిగిన చారిత్రిక ర్యాలీలో ఆమె ఈ చిన్న ప్రసంగాన్ని బహిరంగంగా చదివింది. ఆనాటి నుండి ప్రపంచ వ్యాప్తంగా అనేకానేక సందర్భాలలో వివిధ భాషల్లో ఎన్నో పత్రికల్లో ఇది ప్రచురించబడింది.

ప్రపంచంలో ఎంతోమంది దీనిని వారి వారి భాషల్లోకి అనువాదం చేసుకుని వివిధ సందర్భాలలో సమానతా ఉద్యమానికి సాధనంగా చేసుకున్నారు.

ఇది జరిగి కూడా నేటికి 50 ఏళ్ళు దాటుతోంది. బహుశా తెలుగులో కూడా ఈపాటికి ఏదోక రూపంలో కచ్చితంగా వచ్చే ఉండాలి. భార్య అనే పదానికి ఉండే సార్వత్రిక లక్షణాలను, ప్రపంచ వ్యాప్తంగా కాలమాన పరిస్థితులకు అతీతంగా మహిళలు భార్యలుగా దోపిడీకి గురవుతున్న క్రమాన్ని చిత్రిస్తూ, అద్భుతమైన వ్యంగ్యంతో ఉన్న ఈ చిన్న వ్యాసాన్ని ఇలా తెలుగులో నా వంతుగా తీసుకొస్తున్నాను. ఇంగ్లీషులో నెట్ లో విస్తృతంగా ఇది అందుబాటులో ఉంది. ఆసక్తి ఉన్న వారు ఆంగ్లంలో చదవచ్చు.

టూత్ & నేల్, మదర్లేడ్, Ms వంటి పత్రికల్లో, కొన్ని రహస్య నిషేధిత పత్రికల్లోనూ వచ్చిన ఈ చిన్న రచన ఈనాటికీ మహిళల పట్ల నెలకొని ఉన్న పురుషాధిక్యతని సమర్ధవంతంగా ప్రతిఫలించేలా ఉందని నా అభిప్రాయం. ముఖ్యంగా, భారతదేశంలో భార్యాభర్తలు అనగానే జీవితానుబంధాన్ని సమానంగా పంచుకునే భాగస్వాములుగా కాక యజమాని బానిసలుగా మసలే

ఇద్దరు ఆలుమగలు మనకి తలంపుకొస్తారు. ప్రాపంచిక విషయాలన్నీ పురుష సంబంధితాలనీ, ఇల్లూ, వంటపని, పిల్లలు స్త్రీల పనులనే కేటాయింపు అప్రకటిత అధికారిక ఆమోదంగా సమాజంలో చాలా బలంగా ఉంది.

నిత్యజీవితంలో దైనందినంగా రోజూవారీ కార్యక్రమాలు, పనులు అన్నీ ఈ పురుషాధిక్య భావన గుండానే రూపుదిద్దుకున్నాయి. ఈ చట్రాన్ని బద్దలుకొట్టగలగడమే ప్రత్యామ్నాయ ప్రజాతంత్ర భావజాల ప్రచారోద్యమం చేయాల్సిన పని. అందులో అణువంత భాగం ఈ అనువాద వ్యాసం. అంతర్జాలంలో అందుబాటులో ఉన్నందున ఈ వ్యాసం, వ్యాసకర్త చరిత్ర మొత్తం ఇవ్వడం లేదు. అనువాదంలోని లోపాలకూ, వాక్య సమన్వయ దోషాలకూ బాధ్యత నాదే, సెలవు.





జడీ బ్రాడీ



అనురాధా గాంధీ

# నాకో భార్య కావాలి !

అందరూ అనుకునే భాషలో చెప్పాలంటే, నేను 'భార్య' అనే తరగతికి చెందిన వ్యక్తిని. నేనో భార్యని. కాబట్టి, నేనో అమ్మని.

ఈమధ్యనే విడాకులు తీసుకున్న నా మిత్రుడు ఒకాయనకి ఉన్న బిడ్డ అతడి భార్య దగ్గర ఉంటున్నాడు. అతను మరో భార్య కోసం చూస్తున్నాడు. అతని కోసం ఆలోచిస్తున్న నాకు హఠాత్తుగా ఒక సాయంత్రం, నాక్కూడా ఒక భార్య ఉంటే బాగుంటుందని అనిపించింది. నాకు భార్య ఎందుకు ?

నేను మళ్ళీ స్కూలుకెళ్ళి బాగా చదూకుని ఆర్థికంగా స్వాలంబన పొందాలి. నా మీద ఆధారపడి ఉన్న వాళ్ళని బాగా చూస్కోవాలి. అలా నన్ను స్కూలుకి పంపేందుకో భార్య కావాలి నాకు. అలానే ఇంట్లో నా పిల్లల్ని చూసుకోవడానికి నాకో భార్య కావాలి. నా పిల్లలు సరిగా తినేటట్లు చూసుకునే భార్య కావాలి. అలాగే నాకూ, నా పిల్లలకీ మంచి వంట చేసి పెట్టేందుకు కూడా నాకో భార్య కావాలి. ఆమె మా అందరి ఆరోగ్యాలు ఎల్లప్పుడూ జాగ్రత్తగా చూసుకుంటూ ఉండాలి. ఇల్లుని అద్దంలా పరిశుభ్రంగా ఉంచాలి. మా అందరి ఆరోగ్యాలు, వైద్యం తదితరాంశాల మీద శ్రద్ధ పెట్టాలి. మా బట్టలు చక్కగా ఉతికి మడతలు పెట్టాలి. పిల్లల్ని ఆటవిడుపుకోసం జూకీ, పార్కులకీ షికారు తీసికెళ్ళాలి. నేను స్కూల్లో క్లాసులు మానేయలేను కాబట్టి ఇంట్లో నా పిల్లలకు ఏ సుస్తీ చేసినా జాగ్రత్తగా కనిపెట్టుకు ఉండే భార్య కావాలి. కావాలంటే నా భార్య కనుక పని చేయదలిస్తే, తాను చేస్తున్న ఉద్యోగంలో సమయాన్ని సర్దుబాటు చేసుకోవచ్చు. దానివల్ల జీతంలో కోతలంటారా, అవేమంత విశేషమని. కానీ, తన జీతం మొత్తం నాకూ, నా పిల్లల కోసమేనని ప్రత్యేకంగా చెప్పక్కర్లేదు కదా .

నాకు నా శారీరక అవసరాలు తీర్చేందుకు కూడా భార్య కావాలి. నా ఒంటినీ, ఇంటిని ఆమె ఎప్పుడూ అందంగా ఉంచాలి. నన్నూ, నా పిల్లల్నీ

బయటకీ, ఇంటికీ జాగ్రత్తగా తిప్పి తీసుకొచ్చే భార్య కావాలి. ఇంట్లో నా వస్తువులు ఎక్కడివక్కడ వాటి వాటి స్థానాల్లో చక్కగా అమర్చి సర్దిపెట్టే తీరైన భార్య కావాలి. అంతేకాదు, నా భార్యకి మాంఛి రుచికరమైన వంటలెన్నో తెలిసుండాలి. ఏరోజుకారోజు కావాల్సిన సామాన్లను తెచ్చుకుని అందంగా వండి నవ్వుతూ వడ్డించే భార్య కావాలి. తిన్న తర్వాత నేను చదూకుంటుంటే మా ఎంగిలి కంచాలన్నీ వంట పాత్రలతోసహా తళాతళా మెరిసిపోయేలా తోమేయ్యాలి. నాకూ, నా పిల్లలకీ ఏదైనా జబ్బు చేసినప్పుడు మా ఆలనాపాలనా చేస్తూ కంటికి రెప్పలా చూసుకునే భార్య కావాలి. ఇంకా, స్కూల్లో చెప్పిన పాఠాలు చదవడం లో ,ఇచ్చిన హోంవర్క్ చేయడంలో ఆమె నాకు సాయం చేయాలి. విశ్రాంతి కోసం నాకు మా కుటుంబం, స్నేహితులతో ఎక్కడికైనా పర్యాటక ప్రదేశానికి వెళ్ళాలని అనిపించినప్పుడు, ఇంటినీ, పిల్లల్నీ అంటి పెట్టుకొని ఉండే భార్య కావాలి.

పనిభారం ఎక్కువైపోతోందని ఎప్పుడూ వాపోని భార్య నాక్కావాలి. కానీ, ఆమె నా విసుగునీ, చిరాకునీ ఓర్పుతో సహనంతో వినగలగాలి. ఇంకా నా రాత పనిని ఆమె టైప్ చేయగలగాలి.

ఆమె నా సాంఘిక హోదా దృష్టి లో ఉంచుకుని ప్రవర్తించాలి. ఏవైనా శుభకార్యాలకు వెళితే నేను స్నేహితులతో కాలక్షేపం కబుర్లు చెబుతున్నప్పుడు పిల్లల్ని ఆమె చూసుకోవాలి. అలాగే నేను అతిధుల్ని ఇంటికి పిలిస్తే వారికి రకరకాల వంటకాలు చేసిపెడుతూ, ఎంతసేపు మేం బాతాఖానీ చెప్పుకున్నా మధ్యలో అడ్డు చెప్పని భార్య కావాలి. అలాంటప్పుడు పిల్లల్ని త్వరగా పడుకోబెట్టేస్తే మాకు అంతరాయం లేకుండా ఉంటుంది. వచ్చిన నా అతిధుల్ని ఆమె సంతోష పర్చాలి. వాళ్ళు కనుక పొగ తాగుతున్నట్లైతే యాష్ట్రే అందుబాటులో ఉంచాలి. ఖాళీ అయిన వాళ్ళ మద్యం గ్లాసుల్ని నింపుతుండాలి. ఘుమఘుమలాడే తిను బండారాలు కొసరి కొసరి వడ్డించాలి. వేడి వేడి పొగలుకక్కే కాఫీ మాత్రమే అందించాలి. అప్పుడప్పుడు నాకు రాత్రి సమయంలో ఒంటరిగా బయటకి వెళ్ళి గడిపే పనులు ఉంటాయనే విషయం గుర్తించే భార్య కావాలి.

నా శృంగార భావోద్రేకాలకి నా భార్య ప్రాతినిధ్యం వహించాలి. నా వాంఛలన్నింటినీ సున్నితంగా సంతృప్తి పరచాలి. గాఢమైన నా కోరికలకు అనుగుణంగా ప్రవర్తించాలి. ఎలాగైనా, నన్ను తృప్తిపర్చడమే ఆమె లక్ష్యం కావాలి. అలాగని నాకు మూడ్ లేనప్పుడు, కోరిక కలగనప్పుడు సెక్స్ ని ఆశించరాదు. ఇక ఆమె గర్భనిరోధక పద్ధతులు బాధ్యతగా అవలంబించాలి. నాకిక పిల్లలు వద్దు, ఉన్న పిల్లలు చాలు. నా భార్య లైంగికంగా నాకు మాత్రమే లోబడి ఉండాలి. నమ్మకస్తురాలు,నెమ్మదస్తురాలు అయ్యుండాలి. అప్పుడిక నా మేధస్సును అక్కర్లేని ఆలోచనలపై పెట్టి నేను అసూయతో కుళ్ళుకోనక్కర్లేదు. అలాగే, నాకంటూ వ్యక్తిగత కోరికలుంటాయనీ, వాటికి కళ్ళెం వేయడం వల్లకాదనీ, నా లైంగిక వాంఛనేది ఒక్క భాగస్వామికి మాత్రమే కట్టుబడి ఉండేది కాదన్న విషయం నా భార్య అర్థం చేసుకోవాలి. మొత్తంగా నేను ప్రజలతో కలివిడిగా రాసుకు పూసుకుని ఉండటం సాధారణమేనన్న గ్రహింపు అవసరం.

ఒకవేళ మరొకామె నాకు భార్యగా ఉండడానికి తగిన వ్యక్తని నేను భావించిన పక్షంలో, ప్రస్తుతం ఉన్న భార్యను విడనాడి కొత్త భార్యను తెచ్చుకునే స్వేచ్ఛ, స్వాతంత్ర్యం నాకుండాలి. ఎప్పటికప్పుడు తాజా అయిన కొత్త జీవితాన్ని కోరుకోవడం మగాళ్ళకి మామోలు విషయం. కనుక, అలాంటి పరిస్థితుల్లో నా భార్య పిల్లల బాధ్యత తప్పనిసరిగా తానే తీసుకోవాలి. అప్పుడే నేను ఏ బాదరబందీ లేకుండా హాయిగా ఉండగలను.

నా చదువు పూర్తై ఉద్యోగం వచ్చాక మాత్రం నా భార్య వెనువెంటనే చేస్తున్న బోడి ఉద్యోగం మానేసి ఇంటిపట్టున ఉండాలి. అప్పుడే ఆమె నన్నూ, ఇంటినీ పూర్తిగా చూసుకుంటూ భార్య చేయాల్సిన కర్తవ్యాలకి న్యాయం చేయగలదు.

దేవుడా ! భార్యని ఎవరు కోరుకోరు ?

ఆంగ్ల మూలం: **జడీ బ్రాడీ** స్వేచ్ఛానుసరణ : **గౌరవ్**